సంఘం చెక్కిన శిల్పాలు 1980

రచన : సి. నారాయణరెడ్డి
గాయని : బాలసరస్వతి

పల్లవి :

పోయిరావే అమ్మా —
పోయిరావమ్మా
అత్తవారింటికి—అపరంజిబొమ్మా ॥

చరణం :

ఏ కన్నె పడుచైన ఇప్పుడైన
ఎప్పుడైన
అత్తింటికేగక తప్పదని తెలిసి
విలపించనెందుకో ఈ పిచ్చితల్లి
వెళ్ళిరా చల్లగా నా చిట్టితల్లీ ॥

పల్లవి :

రావమ్మ రావమ్మ రతనాలబొమ్మ
అత్తమామల మెప్పు అందుకోవమ్మ

చరణం :

వైకుంఠపురినుండి వచ్చెనో
మహాలక్ష్మి
వెండికొండను దాటి వచ్చెనో
గౌరి
ఆ పుట్టినింటికి—ఈ మెట్టినింటికి
వన్నె వాసిని తెచ్చి —
వర్ధిల్లవోయమ్మా ●

రచన : శ్రీ అప్పలాచార్య

గాయని : ఎస్. పి. శైలజ

సాకి :

ఓరక్క మొగుడా బావయ్యా —
ఓరత్త మొగుడా మామయ్యా
చెప్పాలంటే సిగ్గయ్యా
చెప్పక తప్పదు ఓరయ్యా

పల్లవి :

అందంచందంలేని మొగుడు
నాకూవున్నాడు
మొగుడు నాకూ వున్నాడు
నానాగడ్డి తింటాడు
మాటల్లోన మొనగాడు
ముక్కూమూతి చూశామంటే
నల్ల కోతిలాగుంటాడు
సెంటుబుడ్డి తెస్తాడు
ఒంటినిండా పూస్తాడు
చేతుల కట్టి చెవులకు పెట్టి
మెడకూ కట్టి నడుముకు పెట్టి
కాళ్ళు పడతాడు
నాకాళ్ళుపడతాడు
కడియాలేస్తాడు
వేసి చూస్తూ వుంటాడు
నాకేసి చూస్తాడు
వెర్రినవ్వు నవ్వుతాడు
బుగ్గమీదగిల్లగానే
బూరల్లె పొంగుతాడు
మొగలిపువ్వు చేతికిస్తే
మడిచి పెట్టుకుంటాడు
చూసీచూసి చెక్కేస్తా
సంబరెక్కి చెక్కేస్తా అంతే ॥

రచన : సి. నారాయణ రెడ్డి

గాయకుడు : బాలసుబ్రహ్మణ్యం

పల్లవి :

దేవుడు చేసిన రూపాలు। ఇవి
సంఘం చెక్కిన శిల్పాలు।
పలుకగలిగినా మూగబోయినవి
ప్రాణమున్న ఈ శిల్పాలు। ఇవి
సంఘం చెక్కిన శిల్పాలు॥

చరణం :

చెరిపివేసినది కుంకుమ కాదమ్మా
తరుణులు కోరే సౌభాగ్యం।
విసిరివేసినవి పూలు కావమ్మా
వికసించే నీ జీవితం।
పగిలిపోయినవి గాజులు కావమ్మా
సెగలే రగిలే నీ హృదయం
మిగిలిందేమిటి? తీరని చీకటి
తేసెలేదా అరుణోదయం॥

చరణం :

పల్లకిలోన ఊరేగించిరి,
పెళ్ళి కూతురుగ ఒకనాడు। నీ
మోము చూసినా పాపమంటునని
మూసిరి తెరలు ఈనాడు।
విధి అను పేరిట మనుషులు ఆడే
విషమ నాటకం ఎన్నాళ్ళు।
వీడేదెపుడు? సంఘం వేసిన
ఆచారాల సంకెళ్ళు।
దురాచారాల సంకెళ్ళు॥

రచన : సి. నారాయణ రెడ్డి
గాయకుడు : బాలసుబ్రహ్మణ్యం;
రమణ

పల్లవి :

నీ కనులలో ఉంది నీలాకాశం
నా కవితలో ఉంది భావావేశం
కడగంటి చూపు కరుణించు నన్ను
కవ్వించుతావు కలకాలం

చరణం :

సువిశాల నయనాల శృంగార
కాంతి
నవనీత హృదయాన వెలిగే
శాంతి
నీ ఎదుట నిలిచి నన్ను నీలో చూసి
నీ నిండు కనులందు రెండైనాను

చరణం :

కనుబొమలు కావా
ఆ కామదేవుని విల్లు
కను చూపులా వింటి
బాణాల జల్లు
తొలిచూపు చేసింది తియ్యని గాయం
ఆ గాయమే కదా! నా భావ గేయం

## 6

రచన : సి. నారాయణరెడ్డి
గాయకుడు : బాలసుబ్రహ్మణ్యం

పలికెను ఏదో రాగం
అలివేణి—ఓ—కల్యాణి నా

లలిత శృంగారమందారవనిలోన
నీనయనాలే కాటుకకు నీలిమ
నేర్పెననీ
నీ నును పెదవి కెంపులకు
అరుణిమ సమకూర్చెనని
మలయపవనం తెలుపగాలిని
ప్రభవించేనాలో ప్రణయ
భావధుని
నీ నగుమోమె కుంకుమకు
నిగ్గులు తీర్చెననీ
నీ పాదాలె పారాణికి
నవరూపం దిద్దెనని
వలచే నాహృది తెలుపగావిని
కల్యాణభావన కలిగెనువిరిబోణి॥

రచన : సి. నారాయణరెడ్డి

గాయని : పి. సుశీల

పల్లవి :

మురళీకృష్ణా — మోహనకృష్ణా
కాసింత నను చూడవోయీ
గిరిధారి
కడకంట ననుచూడవోయి
నిన్ను చేరగ అన్నీమరచే
నీ ప్రియదాసిని నేనోయీ ॥

చరణం :

ఏమి తనువులో నీటిబుడగలు
ఏమి బ్రతుకులో గాలిపడగలు
సారంలేనిది ఈ సంసారం
ఈ మాయజన్మపై
ఎందుకో మమకారం

చరణం :

సిరులకోసమని పరువుకోసమని
చీకటిలో ఈ పరుగుదేనికని
తెల్లవారితే తెలియునుస్వామీ
జీవికి తానేగు త్రోవపదని ॥